# కుల సంఘర్షణలు

కత్తి పద్మారావు




లోకాయత ప్రచురణలు

# ఒక మాట

భారత దేశంలో కుల వ్యవస్థను నిర్మూలించడానికి ఎన్నో ఉద్యమాలు తలఎత్తాయి. వానిలో కొన్ని కొంత మార్పుకు దోహదం చేశాయి. కొన్ని ఉద్యమాలు కొత్త కులాలుగా మారిపోయాయి. ఈ వ్యవస్థను యిలానే వుంచి కులాన్ని పోగొట్టాలనుకోవడం వలననే కుల వ్యవస్థ రూపు మాయలేదు. ఈనాడు కులాలు నానాటికీ అభివృద్ధి చెందుతున్నాయి. కులవైరుద్యాలు వర్గపోరాటానికి ప్రధాన అవరోధంగా వున్నాయి. ఈ అంశాన్ని గూర్చి హేతువాదం పత్రికలో నేను వ్రాసిన వ్యాసాలు చిన్న పొత్తంగా అందిస్తున్నాను. ఇందులో నేటి కుల రాజకీయాలు అనే వ్యాసం స్వర్ణకుమారి పేరుమీద 'హేతువాదం' లో అచ్చయ్యింది. విమర్శకులు చర్చచేస్తారని ఆశిస్తూ.

మీ

రచయిత

# ఇందులో

# కులాలు - అంతస్సంఘర్షణలు

భారతదేశము సంపన్నమైనది. నదులు, కొండలు, ఎడారులు, మాగాణములు ఒకటేమిటి మానవకోటి జీవనోపాధికి ఏమాత్రం లోటులేని ప్రకృతి సంపద, వనరులు కలిగిన దేశం. అయితే యీ వనరులు మొత్తం ఇక్కడ బ్రతుకుతున్న వారందరికి అందుబాటులో లేవు. అందుకే ఇది సంపన్నమైన దరిద్రాల దేశం.

ఇక్కడ పారుచున్నన్ని జీవనదులు మరి ఏ దేశంలో లేవు. ఇక్కడ ఉన్నంతమంది నిత్యదరిద్రులుకూడ ఎక్కడా లేరు. నదీజలాలకు అనువైన సారవంతమైన భూములు, ఈ రెండింటికి తగిన శ్రమశక్తిని ధారబోస్తున్న శ్రమజీవులు, వారి శ్రమశక్తికి ఫలితంగా బంగారు పంటలు. అయితే 100కి 80 మందికి కాలే కడుపులు, కూలే గుడిసెలు- రెక్కాడినా డొక్క నిండని నిరుపేదలు.

# ఇందులో

ఎందుకు ఈ పేదరికం? దేశసౌభాగ్యానికి ప్రజల పేదరికానికి ఈ తారతమ్యమెక్కడిది? అని ఆలోచించాల్సిన అవసరం వుంది. అయితే యీ పేదరికం భూమిని నమ్ముకున్న వారికే కాదు, పరిశ్రమలు నమ్ముకున్న వారికీ సమానంగానే వుంది. అన్ని రంగాలలోను శ్రమచేసేవాడి శ్రమశక్తిని ఎందుకు దోచ్యుగలుగుతున్నారు. కుమ్మరి, చాకలి, మంగలి, రైతుకూలి, కార్మికుడు, నేతవాడు ఒకరేమిటి సామాజికంగా జరుగుతున్న ఈ ఉత్పత్తికి కారకులైన వారందరిని ఎవరు దోచుకుంటున్నారు.

సమాజంలో ఒక భాగం కష్టపడుతూ ఉంటే, మరో భాగానికి కష్టఫలితాన్ని అంతటినీ హరించే అవకాశం ఎట్లా ఏర్పడింది? విత్తకుండా పంటనుకోసుకుపోయే పెద్దమనుష్యులు సమాజంలో తయారౌటకు కారణాలేమిటి? ఆర్థిక సామాజిక రాజకీయ రంగాలలో కొంతమంది మాత్రమే పెత్తనం చేయుటకు కారణమేమిటి? ఆర్థిక సౌభాగ్యం, సామాజికాధిపత్యం, రాజకీయ పెత్తనం ఒకే వర్గానికి పరిమితమై ఒక వర్గాన్ని దోచుకుంటుంటే ఎందుకు ఈ శ్రమజీవులందరూ ఎదురుతిరిగి తమ హక్కులను తాము సాధించుకోలేకపోతున్నారు? ఒక వర్గాన్ని ఈ విధంగా ఆర్థికంగా ఒకప్రక్క దోచుకుంటూనే సామాజికంగా పశువులకంటే హీనులుగా చూడటం ఈ కర్మ

భూమిలోనే జరుగుతుంది. ఈ సామాజిక బహిష్కరణవల్ల మాల, మాదిగ, నేతకాని, డెక్కలి, మాష్టీన్, గుర్రం, దాసరి, సింధు, బండ్ల మొ॥ కులాలవారు భూములన్నీ ఏనాడో కోల్పోయి రెక్కలమీద ఆర్థాకళ్ళతో జీవిస్తున్నారు.

ఊరుబయటపల్లెలు, ఈ పల్లెల శ్రమశక్తిమీద ఊళ్ళు జీవిస్తుంటాయి. ఊరికి పల్లెకి మాత్రం ఏ విధమైన సంబంధం లేదు. పాముకి, చీమకుఇచ్చే గౌరవంకూడ వీరికి యివ్వరు. విద్య లేదు, విజ్ఞానంలేదు, నాగరికతలేదు, భూమిలేదు, భుక్తి లేదు, దాస్యం, బానిసత్వం, దోపిడి నెదిరించలేని అమాయకత్వం వారికున్న సంపదలు. ఊరిలోకి చెప్పులతో రాకూడదు. ఊరిచెరువులో నీళ్ళు ముంచకు డదు. ఒకనాడు బ్రాహ్మణులు ఈ రోజు బ్రాహ్మణులమీద తిరుగుబాటుచేసి సామాజిక ఆర్థిక ఆధిపత్యాన్నివరించిన కులాలవారు వీరిమీద పెత్తనం చేస్తున్నారు. భారతదేశంలోవున్న గ్రామ వ్యవస్థలో ముఖ్యంగా ఈ పెత్తనం కొనసాగుతోంది. భూస్వామ్య వ్యవస్థకు కాలం చెల్లిపోయి పెట్టుబడిదారీ వ్యవస్థ బలపడుతున్న ఈ కాలంలో కూడ అనివార్యంగా పల్లెపట్టుల్లో ఈ ఆధిపత్యం కొనసాగుతోంది. ఉత్పత్తిలో ప్రధానపాత్ర వహిస్తున్న ఈ బడుగువర్గాలవారు కేవలం ఆర్థికదోపిడికి మాత్రమే గాక సాంస్కృతికరంగంలో తరతరాలుగా వెనుకబడి పీడనకి

గురవుతున్నారు. వినియోగవస్తువులుగా, భోగ్యవస్తువులుగా కూడ కొన్ని సమయాల్లో వీరు పై వర్గాలకు ఉపయోగపడుతున్నారు.

తరతరాలుగా వచ్చిన రాచరిక వ్యవస్థలవలన పరిపాలనాధినేతలు బుద్ధిపూర్వకంగా వారిని అణగద్రొక్కగా, స్వతంత్రం వచ్చిన తరువాత ప్రజలచేత ప్రజలకొరకు ఎన్నుకోబడ్డవారు వీరి సాంస్కృతిక ఆర్థిక వెనుకబాటుతనాన్ని ప్రణాళికా బద్ధంగా పెంచి వారిలోని తిరుగుబాటుతత్వాన్ని చంపి దళారితత్వాన్ని మప్పి అన్నిరంగాలలో వారి వెనుకబాటితనాన్ని రాజకీయ దళారీతనానికి వాడుకొంటున్నారు.

దానికి తోడు వారిలో చొరబడిన క్రైస్తవ మతం వారి శ్రమదోపిడికి శాస్త్రీయ కారణాన్ని వివరించకుండా "దేవుడు మీకు ఈ విధంగా వ్రాసిపెట్టాడు. పై వర్గాలకావిధంగా వ్రాసిపెట్టాడు" అని చెబుతూ వారిలో గ్రూపిజాన్ని తీసుకువచ్చి రోమన్ క్యాతలిక్స్, పెంతుకోస్తులు, సెవెంత్ డే ఎడ్వెంటిస్టులు, బిలీవర్సు, రక్షణసైన్యం, బైబిల్ మిషన్, మొదలగు గ్రూపులుగా వారిని విడదీసి వారిలో అంతస్సంఘర్షణ తీసుకువచ్చింది.

అందువల్ల ఒకే వర్గంలో ఘర్షణ ప్రారంభమైంది. స్త్రీలలో ఈ భక్తినిర్వీర్యత ఎక్కువగా వ్యాపిస్తుంటే పురుష

లలో, ప్రభుత్వం, పెట్టుబడిదారులు, ఎరవేస్తున్న సారాయి, బ్రాకెట్, చవకబారు సినిమాలు, వ్యభిచారం మొదలైన మానసిక రుగ్మతలన్నింటిని వంటపట్టించుకొని కులపరంగా, ఆర్థికపరంగా తమ వెనుకబాటుతనాన్ని తామే పెంచుకొనే దళారి వైఖరిని అవలంభిస్తున్నారు. వీరిలో రిజర్వేషన్‌తో ముందుకువచ్చినవారు ఒక కొత్త సంస్కృతిని సృష్టించుకొని వీరికి దూరంగా బ్రతకడానికి ప్రయత్నిస్తున్నారు.

ప్రభుత్వం వీరికి కేటాయించిన నిధులను పదేపదే రేడియోలలో, పత్రికల్లో ప్రకటించి పై వర్గాలకు వీరిపై ద్వేషాన్ని ప్రభుత్వం రగిలిస్తుంది. ఆ నిధులు వీరి పేరుతో మంత్రులు కంట్రాక్టర్లు భోంచేసి హరిజనులకోసమే ప్రభుత్వం వున్నట్లు ప్రచారం చేస్తున్నారు. ఊరికి దూరంగా కులమిమతో నివసించడానికి యోగ్యంకాని ఇళ్ళను నిర్మించి వర్గపరంగా వీరిని దూరంగా నెట్టివేయడానికి ప్రభుత్వం శాయశక్తులా కృషి చేస్తుంది.

హిందూమతం రామాలయాలు నిర్మించి హిందూ క్రైస్తవ వైరుధ్యాన్ని పెంచి పోషిస్తుంది.

ఇంతేగాక వీరిలో వీరికి అంతర్గత ఉపకుల బేధాలు. మాలమాదిగలు ఒకరిఇంట ఒకరు భోజనం చేయరు. వివాహాలు చేసుకోరు. ఒకరిని ఒకరు తీవ్రంగా అపహాస్యం చేసు

ఉంటారు. అట్లాగే సాలీలు దేవాంగులు ఒకే ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితుల్లో జీవిస్తూకూడ ఒకరితో ఒకరికి సామాజిక సంబంధాలు లేవు. ఇట్లానే వెనుకబడిన కులాలలో చాలా ఉపకులభేదాలతో అంతస్సంఘర్షణ సాగుతోంది. పై వర్గాలు, వారిలో ఈ అంతస్సంఘర్షణను ప్రేరేపించడానికి తీవ్రంగా కృషిచేస్తుంటారు. బ్రాహ్మణులలో నంబులు, తంబులు అనే అర్చక కులంవారు ఉన్నారు. వీరు వైదికులు. నియోగులచేత ఈసడింప బడుతుంటారు. శివాలయాన్ని ఒకరు, విష్ణాలయాన్ని ఒకరు ఆశ్రయించి బ్రతుకుతున్న వీరికి సహపంక్తి భోజనం లేదు. వివాహసంబంధాలు లేవు. వైదికులు నియోగులుకూడా అట్లాగే కొట్టుకుంటూవుంటారు. వీరికి ఎట్టి సంబంధాలు లేవు. అట్లాగే కమ్మలో, పెదకమ్మ చినకమ్మ అనే భేధంవుంది. ఇక రెడ్లలో రకాలు వడ్లలో రకాలు పేర్కొనలేనన్ని అనేసామెత ఉండనేఉంది.

ఇంతేగాక ఇంటిపేరుల కక్షలతో ఎక్కువగా పల్లెలలో కొట్లాటలు జరుగుతున్నాయి. మాది బురదగుంట వంశం గొప్పదని, మాది నర్ర వంశం గొప్పదని ఇంటిపేరిటవాళ్ళు ఒకళ్ళపై కొట్టుకుంటూ వుంటారు.

ఇంతేగాక తూర్పువీధి, పడమటవీధిఅని వీధులపేరుతో కొట్టుకుంటూ వుంటారు. పై వర్గాలలోకూడ ఇట్లాంటి కుల

ఘర్షణ తీవ్రంగా ఆ ప్రభావంకూడ వీరిమీద పడుతూ వుంటుంది. పై వర్గాలలోవున్న రెండు వున్నతకులాలు క్రింద కులాలవారిని ఒక్కొక్కరిని ఆకట్టుకొని రెచ్చకొడుతుంటారు.

ఈ మధ్యకాలంలో రాజకీయదుండగులు డబ్బు సారాయితో ఘర్షణలు తెచ్చి, ఒకరిని ఒకరు నరుక్కొనేదాక తీసుకువెళ్ళడం మనం చూస్తూనే వున్నాము.

పంచాయితీఎలక్షన్లలో నిలబడేది భూస్వామ్యవర్గాలు, కొట్టుకునేది బడుగువర్గాలు. స్వామిభక్తితో ఖూనీకేసులో ఒప్పుకొని జైలుకు పోయినవారెందరో వున్నారు. మునసబు, కరణం రాజకీయాలలో ఎన్నో తగాదాలు ఘర్షణలు జరుగుతూనే వున్నాయి.

ఇన్నిరకాలుగావున్న సాంఘిక సాంస్కృతిక ఆర్థిక రంగాలలో వెనుకబాటుతనంవల్ల పీడితవర్గంలో ఈనాడు అంతస్సంఘర్షణ సాగుతోంది. పీడిత ప్రజాసమైక్యతకు అడ్డుగోడలుగావున్న అంశాలమీద శాస్త్రీయవిశ్లేషణ జరగాలి:

ప్రతిగ్రామంలోను పీడితప్రజలసమైక్యతకు అడ్డుగోడగా వున్న అంశముల నన్నిటిని నిర్మాణాత్మకంగా నిర్మూలించడం జరగాలి. అందుకే ఒకేకాలంలో సామాజిక సాంస్కృతిక ఆర్థిక, అసమానత నిర్మూలనోద్యమం చేపట్టాలి. ఆ మహోజ్వలమైన ఉద్యమ జ్వాలనజ్వాలల్లో ఈ అంతస్సంఘర్షణాలను

ధ్వంసం చేసి పీడిత ప్రజా సమస్యా పోరాటానికి సమసమాజం లక్ష్యంగాగల ఉద్యమాలన్నీ కృషి చేయాలి.

అయితే పీడిత ప్రజలకోసం పోరాడే ఉద్యమాలలో కూడ ఈనాడు అంతస్సంఘర్షణ సాగుతోంది. పోరాట మార్గాల విషయంలో అంతర్జాతీయ, దేశ రాజకీయ విధానాలలో వ్యక్తి ప్రాబల్య రాజకీయాలతో తీవ్ర వైరుధ్యాలతో అంతస్సంఘర్షణలు తలెత్తాయి.

ఇవిగాక ఆర్థిక సాంఘిక పోరాటాలలో ఏది ప్రాథమికమైనది అనే అంశంమీదకూడ ఘర్షణ ప్రారంభమైంది. పీడిత ప్రజల చైతన్యాన్ని సమాజ స్థాపనకు రగిలించే క్రమంతో పోరాడే శక్తులన్నీ అంతర్గత వైషమ్యాలను విస్మరించి ప్రజా బాహుళ్యంలో పట్టును సంపాదించి ఒక భౌతికశక్తిగా మారాల్సిన అవసరం వుంది. ఈ వైరుధ్యాలు అంతస్సంఘర్షణలు తొలగిపోవడానికి ఈ దేశానికి, ఈ దేశపీడిత ప్రజాసమైక్యతకు అడ్డుగోడలయిన అంశాల్ని తొలగించి వారిని సంఘటితపరచే క్రమంలో వారికై పోరాడే ఉద్యమాలన్నీ ఏకమవాల్సిన అవసరం వుంది. ఈనాడు ప్రారంభమయిన ఈ సాంస్కృతిక పునర్వికాసోద్యమం ఈ అంతస్సంఘర్షణలకతీతంగా సుసంఘటితంగా ముందుకు సాగగలదని ఆశిద్దాం.

# పీడిత ప్రజా సమైక్యానికి

# కులమతాలు అడ్డుగోడలు

భారతదేశంలో భావదాస్యం తరతరాలుగా కుల ప్రభావంవల్లనే నెలవుచేసుకుంది. భారతప్రజలు ఒకజాతిగా రూపొందటంనుండి నానాటికీ దూరమవటం ఈ కుల ప్రభావం వల్లనే. వందల, వేల కుల సంఘాలుగా ఈ జాతి విడిపోయి వుంది. మానవత్వాన్ని, మానవ తత్వాన్ని నిరశిస్తూ కుల స్పృహను నానాటికీ పెంచుకొంటుంది. భారత సంస్కృతి పేరుమీద కుల దురాచారం గుండెలకు బలంగా ఎక్కింది. ప్రజాస్వామ్యం పేరుతో వున్న స్వేచ్ఛ కులస్వామ్యం క్రింద చలామణి అవుతోంది.

మనదేశం కొన్ని వేల సంవత్సరాలు కులాంతర్ఘర్షణ లలో నిమగ్నమై పరదేశీయులకు బానిసత్వం చేసింది. ఈనాడుకూడా రాజకీయ, సామాజిక, సాంస్కృతి రంగాలలో

ఆధిపత్యంకోసం ప్రాకులాడే నాయకులు కులసంఘాల పేరుతో ఈ తత్వాన్ని పెంచి పోషిస్తున్నారు.

ఈ కుల సంఘాలన్నీ ఆ కులంలో వుండే పేదవాళ్ళకు ద్రోహం చేస్తున్నాయి. జాతి సమైక్యతకు, పీడిత ప్రజా సమైక్యతకూ ఈ కుల సంఘాలు అడ్డుగోడగా వున్నాయి.

గాంధీగారు చారిత్రకంగా, చెరగకుండా వేసిన 'హరిజను' లనే ముద్రకు గురిన్తైన వారి పేరుమీదవున్న కుల సంఘాలు, హరిజన సంఘం, ఆదిఆంధ్ర సంఘం, ఆదిఆంధ్ర క్రైస్తవ సంఘాలు మొదలయిన పేర్లతో చలామణి అవుతున్నాయి.

ఈ సంఘాలనునిర్మించి ఉపయోగించుకొంటూ వారంతా ఆ హరిజనులలోనుండి రిజర్వేషన్ పేరుతో ఉద్యోగాలు, రాజకీయ పదవులు సంపాదించిన దళారులే.

ఆ కులాలలో వందకి తొంభై మంది ఇంకా కూటికీ, గుడ్డకూ, నాగరికతకూ, సంస్కృతికీ దూరంగా అనాగరిక యుగంలోనే బ్రతుకుతున్నారు. వారికోసం రాజకీయ పోరాట ఉద్యమాలుకానీ, సామాజిక సాంస్కృతిక ఉద్యమాలుకాని, వారినుండి విద్య, విజ్ఞానం అలవర్చుకొని ముందుకువచ్చిన వారు జరపటంలేదు. కులం కుళ్ళును కడుపులో పేర్చుకొని కుల తత్వాన్ని రెచ్చగొడుతూ కులాన్ని ఉపయోగించుకొంటున్నారు.

ఇటీవలనే ప్రత్యేకంగా ఏర్పడ్డ మాదిగల సంఘం, ఈ విషయాన్ని రుజువుచేస్తుంది. అస్పృశ్యులుగా చరిత్రగర్భములో దాస్యాన్ని సమానంగా అనుభవించిన మాలమాదిగలే విడివిడిగా కులసంఘాలు స్థాపించుకొని ఒకరినొకరు అపహాస్యం చేసుకొంటూ రాజకీయ దళారీతనానికి ఎగబడుతుంటే పై వర్గాలు వీరిపట్ల సమానతనుచూపే ప్రశ్న ఎక్కడిది?



క్రైస్తవ మతంలో గూడా మాలవారు లూథరన్ మిషన్నూ, మాదిగలు బాప్టిస్టు సంఘాన్ని ఆశ్రయించి బ్రతుకుతున్నారని ఇండియన్ చర్చిల చరిత్ర మనకు తెలుపుతుంది. ఇదంతా శ్రమజీవులయినవారిలో జరగటంలేదు. శ్రమజీవుల పేరిట ఈ కులాన్ని వాడుకుంటున్నవారిలో జరుగుతుంది.



తరతరాలుగా అణగద్రొక్కబడిన జాతులలో పుట్టి, సాంఘిక అసమానతను, ఆర్థిక పేదరికాన్ని పూర్తిగా అనుభవించి, బలహీనవర్గాల పేరున విద్యనార్జించి, ఆర్థికనిచ్చెనపై ఒకటో రెండో మెట్లెక్కి, ఇపుడు పీడితజాతిని మరచి, అటు సామాజిక జిజ్ఞాసగాని, ఇటు జాత్యాభ్యుదయ భావాలుగానీ లేకుండా, ఆ బలహీనవర్గాల పేరుననే రాజకీయ అధికారానికి వారసులై, అణగారిన ప్రజల్ని మోసగిస్తూ దోపిడీ చేస్తున్నవారే ఈ వర్గాలకి ప్రథమ శత్రువులు.

ఇదిలావుంటే, తరతరాలుగా వెలివేయబడిన అస్పృశ్యులకు ఈనాడు ఇస్తున్న అవకాశాలు మాకూ ఇవ్వమని బ్రాహ్మణ సంఘం మరోప్రక్క విజ్ఞప్తి చేస్తోంది.

బ్రాహ్మణులలో తిరుపతివంటి పెద్దపెద్ద దేవాలయాల్ని ఆశ్రయించినవారిని వదలివేస్తే తీవ్రదారిద్ర్యంలో మగ్గుతున్న వారుకూడా ఈనాడెందరో ఉన్నారు. వారింకా బూజుపట్టిన సాంప్రదాయాన్ని, ఆచారాన్ని, వృత్తినీ పట్టుకు వ్రేలాడుతూ తమ సంతానానికి దారిద్ర్యాన్ని ప్రసాదిస్తున్నారు.

వైదికులు, నియోగులు బ్రాహ్మణ సంఘాలు ప్రత్యేకంగా పెట్టుకొంటున్నారు. వీళ్ళు విశ్వహిందూ పరిషత్ వంటి సంస్థల వేదికలమీదేమో 'జాతంతా ఒకటే' అని చెప్తారు. మళ్ళీ బ్రాహ్మణ తత్వాన్ని పెంచుతారు. శవాలుమోసి బ్రతికేవాళ్ళు, బ్రాహ్మణార్థాలతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నవారు ఎందరు పేదలు లేరు? ఎందరు పెళ్ళి పేరంటాలు కాక ఇళ్ళలో కులం పేరుతో మగ్గుతున్నారు? మళ్ళీ వీరిలో వీరికి అస్పృశ్యత. నియోగులు, వైదికులు, నంబుల్ని ఇంకా అస్పృశ్యులుగానే పరిగణిస్తున్నారు. దేవస్థానములలోకి సకల మర్యాదలతో ప్రవేశించే ఒక బ్రాహ్మడు అక్కడ మరొక బ్రాహ్మడిచ్చే తీర్థప్రసాదాల్ని నంబి పేరుతోనే తిరస్కరిస్తున్నారు. ఇంకా వీరు మతాన్ని దళితులదాకా పంతీసికెళ్ళ

గలరు? వీరు సిద్ధాంతంలో ద్వైన్యాన్ని, ఆచరణలో హైన్యాన్ని పాటించటం జీవిత సూత్రంగా పెట్టుకొన్నారు.

అందరికీ కుల సంఘాలున్నాయి కాబట్టి, తమకూ కుల సంఘాలు కావాలనుకునేవారు అందరిలోనివారే అవుతారు గానీ, అందరికంటే అధికులెలాగవుతారు?

వీళ్ళిలా కొట్టుకుంటుంటే, వీళ్ళలో అంతస్సంఘర్షణలు సృష్టించి, ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యం వచ్చిననాటినుండీ రాజకీయ ఆధిపత్యాన్ని చేపట్టిన రెడ్లు, కమ్మలూ బలమైన కులసంఘాలుగా ఏర్పడి రాజకీయ ఆధిపత్యాన్ని తమ గుప్పెట్లో నుండి జారకుండా చూసుకొంటున్నాయి. ఆంధ్రదేశంలోని పెక్కు విద్యా సంస్థలుగూడా వీరి ఆధిపత్యం క్రిందనే నడుస్తు న్నాయి. స్వాతంత్ర్యం వచ్చిననాటినుండి ఈ నాటివరకూ పరిపాలన చేసింది దగ్గరదగ్గర ఈ కులాలవాళ్ళే. ఈ రెండు కులాలలో ఎప్పుడూ సంఘర్షణవుంటూనేవుంటుంది. అధికారం చేపట్టేవిషయంలో సమైక్యతా వుంటూనే వుంది. ఈ కులాల లోనివాళ్ళు ఇంతకాలం రాజకీయ ఆధిపత్యం వహించినా ఆ కులంలోని పేదవాళ్ళకు ఏమీ మేలు జరగటంలేదు. ఈ కమ్మ, రెడ్డి కులాలలో ఎందరో పేదలున్నారు వాళ్ళు వాళ్ళ బిడ్డలకు పెళ్ళిళ్ళు చేసే స్థితిలో లేరు. చదువులు చెప్పించే స్థితిలోనూ లేరు. వాళ్ళ కుటుంబాలలోని ధనికులు ఇచ్చే

తో నేపనులు వీళ్ళుయివ్వలేరు. కుల దర్పంతో, దారిద్ర్యంతో బైటికి చెప్పుకోలేక, ఎన్నో కుటుంబాలు పేదరికపు కుంపటిలో తుకతుక ఉడికిపోతున్నాయి.

ఇంతేకాక విద్యాలయాల్లో, హాస్టళ్ళల్లో కులం విలయ తాండవమాడుతుంది. యువకులలో కులపిచ్చి రేపి రాజకీయ నాయకులు తమ ప్రయోజనాలకు యువశక్తిని వాడుకుంటున్నారు. యువకసంఘాలలో కులం జొరబడి ఘర్షణలు నానాటికీ పెరుగుతున్నాయి. ఎలక్షనులలో ఆయా నియోజక వర్గాలలో కులాల బలాన్నిబట్టే సీట్లివ్వటం జరుగుతుంది. కులం బలంతోనే ఈనాడు క్రొంగొత్త నాయకులు, రాజకీయ ఆధిపత్యానికై పెంపర్లాడుతున్నారు. గొంతులో కులం విషం దాచుకొని పైకి వాగ్దానాలవర్షాన్ని కురిపిస్తున్నారు.

కాపు, బలిజ, తెలగ కులాలు రాజకీయ అధికారం కోసం ప్రాకులాడేవారి ప్రేరణతో ఒక కుల సంఘంగా ఏర్పడ్డాయి. ఎలక్షనులకుముందే వీరు ఇట్లా ఏర్పడటానికి కారణం తమ కులం బలాన్ని చూపించి సీట్లు అడగటానికి అనటములో సందేహం లేదు.

రజకసంఘం ఎప్పటినుంచో ఉంది కానీ రేవులో డొక్కలెండగట్టుకొని బట్టలుతికేవాడికి సున్నం కూడా ఇవ్వలేకపోయింది.

సాలీలకు ప్రాతినిధ్యంవహించిన నాయకులు ఆర్థికంగా పెరిగారుగానీ, మగ్గంగుంటలో మగ్గేవాడికి ఏమి మేలుజరగ లేదు.

ఇంకా నాయీబ్రాహ్మణ సంఘం, అగ్నికుల క్షత్రియుల సంఘం, మహేంద్ర (మేదర్లు) సంఘం, యాదవుల సంఘం, ఎరుకల సంఘం, యానాది సంఘం, గంగపుత్ర (బెస్త) సంఘం, గౌడ సంఘం యిలాంటి సంఘాలు ఎన్నో వున్నాయి.

ఈ విధంగా అన్ని కులాలకూ ఉన్న కుల సంఘాల అధిపతులు ఆ కులాల్లో ధనవంతులు. వాళ్ళే మొత్తం సమాజంలో దోపిడీదార్లు. ఏ కులంలో ఉన్నా పేదలందరూఒకటే. వారి పేదరికాన్ని, సాంఘిక బానిసత్వాన్ని ఈ కుల సంఘాలు నిర్మూలించలేవు. ఈ కులం కుళ్ళునుండి విడివడి, పీడితులు, తాడితులు, శ్రమజీవులు, రెక్కాడినా డొక్కనిండనివాళ్ళు అర్థాకళ్ళతో మగ్గిపోతున్నవారు, కడుపు నింపుకోడానికై శరీరాన్నమ్ముకుంటున్నవాళ్ళు ఒకరేమిటి? దోపిడీకి గురవుతున్న అందరూ సంఘటితమై ఈ దోపిడీ రాజ్యాన్ని, కుల సంస్కృతినీ కూల్చాలి. కుల సంఘాలు దోపిడీదారులకు ఉపయోగపడతాయి తప్ప మానవులకు, పేదలకు కాదు. కులం అనేది మానవుడితో పుట్టలేదు. అది దోపిడీవర్గాల కూటక సృష్టి. కులం ధనవంతులకు, దళారులకే మేలుచేస్తుంది అనే సత్యాన్ని

పీడితులందరూ తెలుసుకొని, రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో సమానతకోసం పోరాటం చేయాలి. సమసమాజాన్ని స్థాపించాలి. విప్లవ, అభ్యుదయ, సామాజిక, సాంస్కృతికోద్యమాలన్నీ ఈ విషయంలో ఏకమై పోరాడాలి.

కులాన్ని నిర్మూలించాలి,
కుల సంఘాల్ని నిషేధించాలి,
కులం కుళ్ళును కెళ్ళగించాలి,
కులరహిత మానవ సంఘంగా మనగలగాలి.

# నేటి కుల రాజకీయాలు

భారత దేశంలో ఈనాడు బలమైన విప్లవ ప్రతీఘాతక శక్తి కులం. ఇది భారతీయ మనస్తత్వాన్ని సంకుచిత పరిధుల్లోకి ఈడ్చుకుపోయింది, మానవత్వాన్ని మానవ తత్వాన్ని కలుషితం చేసింది. మానవులు ప్రజలు అనే పదాల క్రిందకు ఎవరిని రాకుండా చేసింది. ఫలాన కులంవారు అంటేనే పలికే స్థితికి తీసుకువెళ్ళింది. ఈ కులం హిందూ సంప్రదాయవాదం వల్ల అభివృద్ధి చెందింది. హిందూ ధర్మాలు శాస్త్రాలు సాహిత్యం కళలు ఈ కులాన్ని భారతీయుల మెదడుల్లోకి ఎక్కించాయి. భూస్వామ్య వ్యవస్థ తన ఆధిపత్యానికి అధికారానికి ప్రజలు ఎదురుదిరగకుండ విభజించి పాలించడమనే మర్మవ్యూహానికి కులం సాధనమైంది. అది పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యంలో అధికార రాజకీయాలకు పట్టుగొమ్మ అయింది. భారతీయ రాజకీయ దోపిడీవ్యవస్థ మొత్తం ఆర్థికంగా పెట్టుబడిదారీ విధానం మీదను రాజకీయంగా కుల పునాదుల మీదను నిర్మింపబడిందనుటలో అత్యుక్తి లేదు.

ఇప్పటికీ ఉత్తరభారతంలో ప్రధానమైన కీలకస్థానాల్లో ఉన్నత కులాలవారే వున్నారు. దక్షిణభారతంలో శూద్రులు, అగ్ర వర్ణాలవారైన బ్రాహ్మణులమీద తిరుగుబాటుచేశారు. దాని ఫలితంగానే తమిళనాడులో శూద్రులు రాజ్యాన్ని స్థాపించు కున్నారు. ఆ తరువాత ఏమిజరిగింది? బ్రాహ్మణులు ఆనాడు ఎట్టి అధికార అహంకారాలతో సామాజిక అధికార రంగాల్లో ఇతరులను యెలా తూలనాడేరో, శూద్రులైన తమిళనాడు ప్రభుత్వంవారుకూడా అలానే చేశారు. వారి క్రిందవున్న అంటరానివారు అస్పృశ్యులు అని చెప్పబడుతున్న వారిని వారేమి పట్టించుకోలేదు. వారి అభ్యున్నతికి సాంఘిక సాం స్కృతికమైనసంస్కరణలుసరైనవనితీసుకురాలేదు. ఆంధ్రలో బ్రాహ్మణులమీద కమ్మవారు బ్రాహ్మణ వ్యతిరేకోద్యమం నడిపారు. మిగిలిన శూద్రకులాలవారుకూడా ఈ పోరాటంలో వారికి అండగా నిలిచారు. ఆ తరువాత ఏమైంది? శూద్రు లైన రెడ్డులకు, కమ్మవారికి సాంఘిక, ఆర్థిక, రాజకీయహోదా లభించింది. వారు అలనాటి బ్రాహ్మణులకు రాజులకు వున్న దుర్లక్షణాలనన్నింటిని వంటపట్టించుకొని కుల రాజకీయ యంత్రాన్ని బాహాటంగా నడుపుతున్నారు. వారికితోడు హరిజను లలో నుండి వచ్చిన దళారులు వారికి తొత్తులుగావుండి వారి స్వప్రయోజనాలకు సామాన్యప్రజలను తాకట్టుపెడుతున్నారు. ఈనాడు బలమైన రెండుకులాల పెద్దల చేతులలోను, హరిజ

నులని చెప్పబడుతున్న దళారులు కొద్దిమంది చేతుల్లోను మన ఆర్థిక సాంఘిక ఆధిపత్యం చిక్కింది. వీరు తరతరాలనుండి బలమైన కులం రొంపిలో కూరుకుపోయిన ప్రజలను మాయ మాటలతో మోసంచేయగలుగుతున్నారు. దేశంలో ఎక్కడ చూచినా నిరుద్యోగం, నిరక్షరాస్యత నిద్రాణమయిన ప్రజల ఆకలిరోదనలు. వారిని మాయమాటలతో ఈ ప్రభుత్వం ఎప్పుడూ మత్తులో వుంచగలుగుతున్నది. ప్రజా ఉద్యమాలు ఒకప్రక్క సాగుతున్నాయి. ప్రాణాలు యివ్వడానికికూడా వెనుకాడని ఉద్యమాలు ఒకవైపు, ప్రజాస్వామ్య పద్ధతుల్లో విప్లవం తెద్దామనే గ్రూపులు ఒకవైపు విప్లవాన్ని ప్రజల్లో తెచ్చే క్రమంలో మారిన మనస్సుల్లో మెదడుల్లో గూడుకట్టు కొన్న ఈ బలమైన కులభావాన్ని కర్మభావాన్ని పారద్రోల వలసివుంది. ఈనాటి, నిన్నటి రాజకీయ పాలకులు, పెట్టుబడి దారులు, భూస్వాములు మతతత్త్వం, కులతత్త్వం వంటికి పట్టించుకున్నవారు. మన ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు గారు ఆయన గెలువకముందే తిరుపతికి వెళ్ళి గుండుచేయించు కున్న భక్తుడు. తద్వారా ప్రజలకు ఏమివ్వదల్చుకున్నాడో ఆనాడే చెప్పాడు ఆయన జీవితాన్ని అధ్యయనంచేసినవాడె వడైనా ఆయనకు ఎంత కులపిచ్చి వుందో ఎరుగుదురు. మన రెడ్డిప్రభువులకు ఏ మాత్రం తీసిపోని కులభావం ఆయన వంటి నిండా అలముకొని వుంది.

ఆయనకు జ్యోతిష్కులన్నా మంత్రగాళ్ళన్నా అమితమైన భక్తి. ఆయన పరుల అభిప్రాయాలకు ఏనాడు విలువనిచ్చే వాడుకాదు. మన ప్రభుత్వం సెక్యులరిజం, సోషలిజం, ప్రజాస్వామ్య సూత్రాలమీద నిర్మితమైందని చెబుతున్నారు ఈ కాషాయాంబరధారికి సెక్యులరిజం అంటే ఏమిటో తెలియదు. గణపతి నిమజ్జనోత్సవాల్లో శివమెత్తి ఉపన్యాసాలు ఇవ్వడం, అసెంబ్లీలలో గోచీవిప్పి నాట్యంచేయడం, ఏకకుండ ధారుడుగా వూరేగడం, ఇవన్నీ సెక్యులర్ భావాలకు విరుద్ధాలు. సోషలిజానికి ఇవన్నీ బలమయిన శత్రువులు. భూస్వాముల, పెట్టుబడిదారుల ఆస్తులకు పెత్తనాలకు ఏ విధమైన విఘాతం కల్గించడం ఈయన అభిమతంకాదు. భూ సంస్కరణల విషయములో ఈయన వ్యవహరిస్తున్న తీరు ఇది స్పష్టంచేసింది. గ్రామాధికారులను తొలగించడంలోకూడా రెడ్డి కమ్మ కులాలకు వ్యవస్థయొక్క ఆధిపత్యాన్ని మొత్తంగా అప్పజెప్పడం ఆయన అభిమతం. యన్.జి.ఓ. ల విషయాల్లో ఆయన వ్యవహరించినతీరు, అనేక ఉద్యమాలను అణచడంలో ఆయన చూపిస్తున్న నియంతృత్వ ధోరణి, ఆయన ఏనాటికీ ప్రజాస్వామ్యవాది కాదనేది స్పష్టంచేస్తుంది. ప్రజలను ఆకర్షించే మత్తుమాటలు, ఉద్రేకించే ఉపన్యాసాలు చేయడం రోజుకొక క్రొత్తతంతుతో ప్రజల దృష్టిని ప్రక్కదోవ పట్టించడం, కులపెద్దల సలహాలతో ప్రభుత్వాన్ని నడపడం, కులం

షాన్ని నరనరాల్లో నింపుకొని సమతా వాక్యాలు ప్రవచించ డం ఆయన అలవాటుచేసుకున్నాడు. కాంగ్రెస్ ప్రభుత్వంలో ఆంధ్ర దేశాన్ని మొత్తంగా ఎన్నోరంగాలనుండి దోపిడీచేసిన చెన్నారెడ్డి అధికారంకోసం క్రొత్త పార్టీని నిర్మించినాడు. ఈయన వెనుక సత్యసాయిబాబా హస్తం వున్నది అనేది సత్యం. సత్యసాయిబాబా ఇంటర్వ్యూ ఇవ్వలేదనే కారణంతో ఎన్. టి. రామారావుగారు తన సినిమాల్లో అతణ్ణి పరాభ విస్తూ ఒక సన్నివేశంతీశాడని కోపంకాబోలు. ఇక కాంగ్రెస్ వారు "గ్రేట్ రాయలసీమ" నినాదంతో ప్రాంతీయతత్వాన్ని మరొకప్రక్క లేపచూస్తున్నారు. ఈ విధంగా ప్రాంతీయ కుల మతభేదాలను అధికార రాజకీయాలకోసం రెచ్చగొడుతూ ప్రజలకు మేలుచేయకపోగా ప్రజల గుండెల్లో అగ్ని రగిలించ చూస్తున్నారు.

ఇన్నిరంగాలనుండి ప్రజలను విచ్ఛిన్నంచేసి వారి అధి కార కుల రాజకీయాలకు వాడుకోవడానికి ప్రయత్నిస్తుంటే మరి వామపక్షఅభ్యుదయశక్తులు ఏమిచేస్తున్నట్టు? వారుకూడ రాజకీయ అధికార ప్రత్యామ్నాయంకోసం ప్రాకులాడుతు న్నారు. వ్యవస్థలోకి జొరబడే ఈ కుతంత్రాన్ని ప్రజలకు తెలిపి, ప్రజలలో చైతన్యాన్ని ఆలోచనను విప్లవాన్ని తేవడా నికి ఆలోచిస్తున్నారా? ఈనాటికీ మధ్యతరగతినిదాటి గ్రామీణ ప్రజల గుండెల్లోకి ఎక్కువ ఉద్యమాలు పోలేకపోతున్నాయి. ఈనాడు వామపక్షాల రాజకీయ ప్రత్యామ్నాయాన్ని సీట్ల సర్దుబాటును ప్రక్కనబెట్టి నిజాయితీగ ప్రజల్లోకి జొరబడి

ప్రజలను చైతన్యవంతం చేయడానికి కదలవలసిన అవసరాన్ని గుర్తించాలి. ఎత్తుగడలతో ప్రభుత్వాన్ని పట్టుకున్నాక వ్యవస్థను మొత్తంగా మార్చుతాము అనేది కల్ల. ప్రజల్లో చైతన్యం లేకుండా, వారు ఆలోచించకుండా రాజ్యాలు మనచేతికిరావు, అది విప్లవం కాదు. ఒక మతవాదితో, విప్లవ వ్యతిరేకితో ఎత్తుగడ పేరుతో చేయిగలపడంవలన ప్రజలు మనల్ని నమ్మరు అనేది సత్యం. కేంద్రస్థాయిలో ఈతడితో కలవడం, రాష్ట్ర స్థాయిలో విభేదించడంవంటి వ్యూహాలవల్ల విప్లవాలు విజయవంతం కావు. అందువలన ఈనాడు వామపక్షాలు ప్రజల గుండెలవరకు వెళ్ళి నిజం చెప్పాల్సిన అవసరాన్ని మరువ కూడదు. విప్లవ శక్తులన్ని తమలోవున్న అశాస్త్రీయ ధోరణులను తగ్గించుకొని శాస్త్రీయపథంలో ఉద్యమాలను నడుపుకొనే క్రమంలో ఐక్యంకావలసిన అవసరం వుంది.

విప్లవం పుట్టవలసింది ప్రజల్లో. ఆ ప్రజల్లో చైతన్యం రావడం అవరం. విప్లవానికి ప్రతీఘాతంగావున్న ప్రతి అంశం మీద యుద్ధంచేసే క్రమంలో విప్లవ అభ్యుదయ హేతువాద శక్తులన్నీ ఏకమై ముందుకు పోతూ ప్రజలకు విప్లవం విజయం పట్ల విశ్వాసాన్ని కలిగించవలసిన అవసరం వుంది. లేనట్లైతే కేవలం తెలుగుదేశం నుండి కాంగ్రెస్, కాంగ్రెస్ నుండి తెలుగుదేశం పేర్లమార్పుతో ఒకేవర్గం, అధికారం చేస్తూనే వుంటుంది. మన ఉద్యమాలు విఫలమవుతూనేవుంటాయి. నిజాయితీగా ఈనాడు ఉద్యమకారులందరూ పునరాలోచించవలసిన అవసరం వుంది. అంతవరకు ఈ సమస్యలకు పరిష్కారం?

# క్రైస్తవ మతంలో కులం

క్రైస్తవమతంలో కులం బలీయమైన పునాదిని నిర్మించుకొంది. కులం కుళ్ళును కడుపులో పేర్చుకొన్న క్రైస్తవ భారత సామాజిక వ్యవస్థకు ఒక రాచపుండుగా మిగిలింది. భారతదేశంలో తరతరాలుగా అణగద్రొక్కబడిన వెనుకబడిన కులాలవారు ప్రధానంగా ఈ మతాన్ని ఆశ్రయించారు. ఈ మతం వారికి మత్తును నిర్వీర్యతను ప్రసాదించింది. తమ సాంఘిక హక్కులకోసం పోరాటం చేసే చైతన్యాన్ని హరించింది. పరలోకతత్వాన్ని జడస్వభావాన్ని వీరికి మప్పింది. అంతేకాక హిందూ కులస్వభావాన్ని గుండెలకు ఈ మతం నిండుగా పట్టించుకుంది. క్రైస్తవం నామమాత్రంగా వుండి హిందుత్వం స్వభావంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. రాను రాను ఆర్థికప్రయోజనంకోసం ఉన్నతకులాలవారు ఈమతంలో బలంగా చోటుచేసికొన్నారు. వెనుకబడిన కులాలలోని ఒక దళారివర్గం ఈ మతంద్వారా ఆర్థికలాభాన్ని పొంది విదేశీయ నిధులతో సుఖలాలసులౌతున్నారు. అయాచితంగా లభించిన ధనం ద్వారా ఒక వింత ఆర్థిక వర్గం ఏర్పడి పోరాటాలకు, మార్పుకు అడ్డుగోడగా వుంది. ఈ మతంలోని ఆన్నార్తులు

దారిద్ర్యాన్ని, దైన్యాన్ని గుండెపొరల్లో పేర్చుకొని లేని పర లోకంకోసం అహరహం కీర్తనాలాపనలు చేస్తున్నారు. వెనుక బాటుతనాన్ని సామాజిక బానిసత్వాన్ని వరంగా వీరు భావి స్తున్నారు. కోట్లాది రూపాయలు పరిపేరుతో పెట్టుబడిదారీ దేశాలనుండి దిగుమతి అవుతూ సాంస్కృతిక చైతన్యానికి ప్రజల్ని దూరంగాఉంచే భజనలకు ఉపయోగపడుతున్నాయి. మానవత్వం, నిర్మలత్వం లోపించి కులతత్వంతో కుళ్ళి కంపు గొడుతున్న ఈ మతంలోని కులాన్ని గూర్చి అస్పృశ్యతను గూర్చి పరిశీలిద్దాం.

చర్చిల్లోని కులతత్వం అస్పృశ్యతల గూర్చిన కొన్ని వాస్తవికాంశాలు.

ప్రొటెస్టెంటు చర్చిలో అంటరానితనం :-

1) రాయచోటిలో అచటి పారిష్‌కు ఒకఅమెరికను మిషనరీతర్వాత మాల పాస్టరు వచ్చినందుకు నిరసనగా ఎస్. ఎ. ఎల్. సి. కి చెందిన 32 క్రైస్తవ రెడ్డి కుటుంబాలు, మతంపుచ్చుకున్న రెండోతరంలో చర్చిని వదలిపెట్టి క్రమంగా హిందువులుగా మారిపోయారు.

2) కృష్ణా గోదావరి డయాసిస్‌కు చెందిన ఐతవరం సి.యస్.ఐ. చర్చిలో షె. కు. లో జన్మించి క్రైస్తవులుగా మారిన వారితో ఇమడలేక కొన్ని కమ్మ కుటుంబాలు తమకోసం ప్రత్యేక చర్చి నిర్మించుకొన్నవి.

3) మధిరతాలూకాలోని జమ్మలాపురం చుట్టుపట్ల నివసిస్తూ, కృష్ణా గోదావరి డయాసిస్‌కు చెందిన సి. యస్. ఐ. చర్చి సభ్యులుగా నుండిన కమ్మ క్రైస్తవులు, ప్రత్యేకంగా నెలకొకసారి సమావేశమై సామూహిక ఆరాధన చేసుకొంటారు. ఈ విధంగా క్రైస్తవ మతంలోవున్న కుల పోకడల తీరుతెన్నులు క్రిందనిచ్చిన పట్టికలద్వారా విశదమవుతాయి.

## పట్టిక – 1

## రోమన్ కేథలిక్‌లు

| క్ర. సంఖ్య | బిషప్పుల జిల్లాలు | జిల్లాలు ప్రాంతాలు | కేథలిక్‌లు | మత పురుషులు | సిస్టర్స్ | కులాలు |
|---|---|---|---|---|---|---|
| 1. | కడప | కడప, చిత్తూరు | 37,000 | 52 | 78 | మాదిగ/మాల/రెడ్డి |
| 2. | ఏలూరు | ఏలూరు,ప॥గోదావరి | 75,927 | 60 | 153 | మాల/మాదిగ |
| 3. | గుంటూరు | గుంటూరు | 1,00,457 | 108 | 354 | మాల/మాదిగ/రెడ్డి /కమ్మ/సాలీలు |
| 4. | హైదరాబాదు | హైదరాబాదు సికిందరాబాదు నగరం, రంగారెడ్డి, మెదక్ | 38,787 | 137 | — | పెల్లరు |
| 5. | కర్నూలు | కర్నూలు, అనంతపురం | 47,300 | 57 | 102 | మాల/మాదిగ/రెడ్డి |
| 6. | నల్గొండ | నల్గొండ | 34,250 | 35 | — | డిటో |
| 7. | నెల్లూరు | నెల్లూరు, ప్రకాశం | 33,053 | 43 | 124 | మాల/మాదిగ |
| 8. | విజయవాడ | కృష్ణా | 1,27,691 | 126 | 391 | 3లో మాదిరి |
| 9. | విశాఖపట్నం | శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి | 90,467 | 117 | 91 | మాల/మాదిగ/ కొండతెగలు |
| 10. | వరంగల్ | వరంగల్, ఖమ్మం, కరీంనగర్ | 66,508 | 70 | — | మాల/మాదిగ |
| మొత్తం 10 | | ఆంధ్రప్రదేశ్ | 6,61,450 | 805 | 1,291 | మాల, మాదిగ, రెడ్డి,కమ్మ,సాలీలు |

షరా :- 5% కంటె తక్కువ కేథలిక్‌లున్న కులాలు వదలివేయబడినవి.

పట్టిక –2

## ప్రొటెస్టెంట్లు

| వరుస సంఖ్య | బిషప్పుల జిల్లాలు | జిల్లాలు ప్రాంతం | క్రైస్తవులు | కులాలు |
|---|---|---|---|---|
| 1. | డోర్నకల్ | వరంగల్, ఖమ్మం | 66,000 | మాల/మాదిగ/కొండ తెగలు |
| 2. | కృష్ణా మరియు గోదావరి | కోస్తాఆంధ్ర, నెల్లూరు వినా | 1,48,000 | మాదిగ/మాల |
| 3. | మెదక్ | మెదక్, నిజామాబాద్, అదిలాబాద్, హైదరాబాదు, సికిందరాబాదు | 1,43,000 | మాల/మాదిగ/కొండ తెగలు |
| 4. | నంద్యాల | కర్నూలు, కడప | 44,000 | మాల/మాదిగ |
| 5. | రాయలసీమ | కడప, అనంతపూర్, చిత్తూరు, కర్నూలు | 61,000 | మాల/మాదిగ |
| 6. | కరీంనగర్ | కరీంనగర్, వరంగల్, నల్గొండ | 66,000 | మాల/మాదిగ/కొండ తెగలు |
| మొత్తం | 6 | ఆంధ్రప్రదేశ్ | 5,28,000 | మాల/మాదిగ/కొండ తెగలు |

షరా :- 5% కంటె తక్కువ క్రైస్తవులున్న ప్రతి కులం వదలి వేయబడినది.

## పట్టిక — 3

## ప్రొటెస్టెంటు పేరుతో వున్న ఇతరులు

| వ.సం. సంఖ్య | నామకరణము | ప్రాంతం/జిల్లాలు | క్రైస్తవులు | కులాలు |
|---|---|---|---|---|
| 1. | ఎ.ఇ.ఎల్.సి. | కోస్తా ఆంధ్ర (నెల్లూరు వినా) | 2,70,000 | మాల/మాదిగ |
| 2. | ఎస్.ఎ.ఎల్.సి. | నెల్లూరు, మద్రాసు నగరం చిత్తూరు, కడప | 16,000 | మాల |
| 3. | ఎస్.టి. బి.సి. | నెల్లూరు, కర్నూలు, ప్రకాశం, గుంటూరు, తూర్పుగోదావరి, కృష్ణా | 2,82,000 | మాదిగ/మాల |
| 4. | కెనడియన్ బాప్టిస్టు చర్చి | తూ॥ ప॥ గోదావరులు విశాఖపట్నం, విజయనగరం | 1,00,000 | మాదిగ/మాల |
| 5. | మెథాడిస్టులు | తెలంగాణా ప్రాంతం | 1,08,000 | మాదిగ/మాల/కొండతెగలు |
| 6. | సాల్వేషన్ ఆర్మీ | నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, తూ॥ గోదావరి | 70,000 | మాల/మాదిగ |
| 7. | మెన్నోనైట్, సెవెంత్ డే ఎడ్వంటిస్టులు, పెంతెకోస్తులు వగైరా | ఆంధ్రప్రదేశ్ | 1,82,000 | మాల/మాదిగ |
| మొత్తం 7 | | ఆంధ్రప్రదేశ్ | 10,28,000 | మాల/మాదిగ |

షరా : 5% కన్నా తక్కువ క్రైస్తవులున్న ఏ ఒక్క కులమైన వదలివేయబడింది

## పట్టిక – 4

## ఆంధ్రప్రదేశ్‌లోని క్రైస్తవులు తుది విశ్లేషణ

| | | |
|---|---|---|
| మొత్తం క్రైస్తవుల సంఖ్య | : | 22,17,450 |
| కేథలిక్‌లు | : | 6,61,450 |
| ప్రొటెస్టేంట్స్ | : | 15,56,000 |
| కేథలిక్‌లు : ప్రొటెస్టేంట్ల నిష్పత్తి | : | 30 : 70 |

### కులం వారీగా కనబరచుట

| | | షె. కు. క్రైస్తవులు | ఇతరులు |
|---|---|---|---|
| కేథలిక్‌లు | : | 4,96,085 | 1,65,365 |
| ప్రొటెస్టేంట్‌లు | : | 14,93,760 | 62,240 |
| మొత్తం | : | 19,89,845 | 2,27,605 |
| శాతము | : | 90% | 10% |
| కేథలిక్‌ల నడుమ | : | 75% | 25% |
| ప్రొటెస్టేంట్‌లు | : | 96% | 4% |

## పట్టిక – 5

## 80% అపైన ప్రాబల్యంగల ఏకైక కులం

| | | |
|---|---|---|
| మాల | : | ఎస్. ఎ. ఎల్. సి. సాల్వేషన్ ఆర్మీ, రాయలసీమ మరియు నంద్యాల, సి. ఎస్. ఐ. డయోసిస్, నెల్లూరు ఆర్. సి. యం. డయోసిస్. |
| మాదిగ | : | ఎస్. టి. బి. సి. |

| బిషప్పులు | మొత్తము | మాల | మాదిగ |
|---|---|---|---|
| కేథలిక్‌యి | 10 | 1 | — |
| సి. యస్. ఐ. | 6 | 5 | — |
| మెథాడిస్టులు | 1 | — | 1 |
| మొత్తము : | 17 | 6 | 1 |

సంఘము మెడ్యాలు కులములో పుట్టిన
క్రైస్తవులను అంటరానివారుగా పరిగణిస్తుంది.

1) పౌరహక్కుల-రక్షణ చట్టంక్రింద నెల్లూరుజిల్లాలో న్యాయ విచారణలోనున్న మూడు వ్యాజ్యములలోను హరిజనులు వారిలోనుండి క్రైస్తవులుగామారినవారు బలిపశువులుగా నున్నారు.

2) ఆంధ్రప్రదేశ్ లో క్రైస్తవం హరిజనులకు పర్యాయపద ముగా వుంది.

3) నెల్లూరు జిల్లా ఇసకపల్లిలో 1980 మే లో జరిగిన కొట్లా టలలో మరణాల సంఖ్య 5 లో 3 మెడ్యాలు కులములో పుట్టిన క్రైస్తవులది.

కుల ప్రభావములు :-

1) ఎస్.ఎ.ఎల్.సి. : 37లో 31 పాస్టర్లు కేవలం మాలకులం వారిని. లక్ష ఉన్న మాదిగల నుండి నేటికికూడ ఒక్క పాస్టరు గాని కార్యవర్గ సభ్యుడు గాని లేడు.

2) ఎస్.టి.బి.సి. : 12లో గల మాలలెవరు సమవసన్ యొక్క కార్యవర్గ సభ్యుడు నేటికి కాలేదు.

3) సాల్వేషన్ ఆర్మీ : మాదిగ కులంనుండి కేవలం 6గురు కెప్టెన్లు కాగలిగారు. మేజర్లయినవారిసంఖ్య 2 మాత్రమే.

ఒకే తెగలో అంతర్వివాహం :-

1) 116 వంశ్ల ప్రాయంగల ఎస్. ఎ. ఎల్. సి తన 16,000 జనాభాలో కులాంతర వివాహాలు చేసికున్న జంటలు 20 మాత్రం. అవి పెద్దలు ఏర్పాటుచేసిన పెళ్ళిళ్ళుకావు.

2) ఒక సర్వేలో వెల్లడైన విషయమేమనగా నెల్లూరు పట్టణంలోని అన్ని నామకరణాల క్రైస్తవులలోను 3వ తరంలోను, 4వ తరంలోను 1.2%కులాంతరవివాహాలు జరిగినై.

ఆరాధనం :-

ఎస్.టి.బి.సి. మొదట బాప్టిస్టుచర్చికోసం కులం మాలలను విభజించింది. రెండోదానికోసం మాదిగలను విభజించింది.

పొదుపు :-

ప్రొటెస్టెంటుశాఖల ఆస్తి, వైద్య విద్యాసంస్థలు కేథలిక్ శాఖల ఆస్థిపాస్తులకు ఆంధ్రలో సమఉజ్జి కావు. కులం కారణంగా సకల కేథలిక్ సంస్థలు, ఆస్తి బొంబాయి డయోసిస్ ఒక్కదానికి సైతం సాటిరావు.

జాతీయ నిర్మాణాలలోని స్థానం :-

నేటివరకు పెద్ద్యాలు కులములో పుట్టిన ఏ క్రైస్తవుడు ఎన్.సి.సి.ఇ., వై.యం.సి.ఎ., సి.బి.సి.ఐ., సి.ఇ.యు.ఎ. వగైరాలలో కార్యవర్గసభ్యుడు కూడ కాలేదు.

గమనింపదగిన అంశమేమనగా క్రైస్తవ విభిన్నశాఖలు పాలిసీలు, మతాలు కులం పునాదిమీదే పుట్టి పెరిగాయి.

సాధారణ పరిపాలన, నిర్వహణ, నిర్ణయాలు గైకొనటం, ఎన్నికలు తగినంతగా కులంవల్లనే ప్రభావితమైనాయి. క్రైస్త వులనడుమ కుల దురభిమానాలు, స్పర్థలు ప్రాచీన హిందూ ఆలోచనా నిర్మాణానికి తక్కువేమి కావు.

క్రైస్తవుల జీవన సరళి, జీవన పరిస్థితులు, నివాసం, వృత్తి, బాంధవ్యం, అలవాట్లు, ఆచారాలు హిందూ సంఘం లోని తమ మూలకులానికి చెందినవే. వారి సాన్నిహిత్యం, పెళ్ళి, చుట్టరికాలు మతంతో నిమిత్తం లేకుండా క్రమంగా ఆయాకులాలకు చెందినవే. కుల వాచకాలయిన రెడ్డి, నాయుడు, శాస్త్రి, వగైరాలు తమ క్రైస్తవ పేర్లకు చివర సిస్టర్లుకు సైతం ఉంటున్నాయి. కులాలకుండే సకల గుణశీలాలు, వ్యత్యాసాలు ఆంధ్రప్రదేశ్‌లోని క్రైస్తవులు నిలబెట్టుకుంటు న్నారు. తమకులాన్ని తమస్కూలు సర్టిఫికెట్లలోను, సర్వీసు కపిళ్ళలోను, చర్చి రికార్డులలో కూడా నమోదు చేసుకుంటు న్నారు.

కులాచారాల ఒరవడి, అయోగ్యతలు :-

ఆంధ్రప్రదేశ్‌లోని చర్చిలలో కులాచారాల ఒరిపిడి అయోగ్యతలను, దిగువ తెల్పిన రీతిని మూడు రకాలుగా అధ్యయనం చేయవచ్చు.

1) ఉన్నత కులాలు, అస్పృశ్యులు
2) అంటరానివాళ్ళకు పెద్దకులాల వాళ్ళకు నడుమగల స్పర్థలు దురభిమానాలు.

8) విభిన్నకులాలపడుమనుండే పోరాటాలు, వర్గఅధికారం.

ఇండియాలోని ఏ రాష్ట్రంలోగాని క్రైస్తవులలో అంటరానివారి సంఖ్య ఆంధ్రలో ఉన్నంతగా లేదు. ఆంధ్రలో వారిది పైచేయి.

మొత్తం మీద మనం క్రైస్తవ మతములోని ఆయా చర్చి గ్రూపులలో నెలకొనియున్న కులం, అస్పృశ్యత వివరాలను గణాంక పద్ధతిద్వారా పరిశీలించాము. ఈ వివరాలను చూశాక క్రైస్తవమతం కుల దుర్గంధంతో నిండి మానవత్వానికి దూరంగా పోరాటశక్తికి వ్యతిరేకంగా, సమసమాజ నిర్మాణానికి భంజకంగా, చైతన్యానికి శత్రువుగా, శాస్త్రీయ జ్ఞానానికి అవరోధంగా, పీడిత ప్రజాసమైక్యానికి అడ్డుగోడగావుండి సంస్కరణకు, అభ్యుదయానికి, విప్లవానికి వ్యతిరేక శక్తిగా అభివృద్ధి చెందుతుంది అనేది అవగతమవుతుంది.

విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రసాదించే మతం అని ప్రచారం చేసుకొంటూ చర్చిలో సాటి మానవుణ్ణి దూరంగా కూర్చోబెట్టే అమానుషం ఈ మతంలో కనిపిస్తుంది. ఎన్నో కుల ఘర్షణలకు ఈ మతం ప్రేరకంగావుంది. తరతరాలుగా అంటరాని వారుగా హిందూమతంచేత ఈసడింప బడ్డవారు ఈ మతంలో జేరితే ఈ మతంలో అంతకంటే సాంఘిక బానిసత్వం నెలకొల్పింది. హిందూమతంనుండి క్రైస్తవ మతంలోకి మారినా, ఇస్లాంమతంలోకి మారినా మర్ల శుద్ధిసంఘాలద్వారా హిందువులుగామారినా, ఈ మతాలన్నీ ఒకే మురుగుగుంటలో

బుట్టిన సూత్రక్రిములే. ఆ మురుగుగుంటను పూడ్చుకోనంత వరకు మానవతా సౌగంధ్యాలు మనకు దూరమే. ప్రభుత్వం ఈ మత ప్రచారాలకు, కుల సంఘాల అభివృద్ధికి అంతరంగికంగా సహకరించటం జరుగుతుంది. సెక్యులర్ భావాన్ని ప్రజాస్వామ్య నీతిని సోషలిస్టు దృక్పథాన్ని ప్రజలలో వ్యాపింపజేయాలన్నపుడు వాటికి అవరోధంగా వున్న కులమత భావాలను ప్రజల మనసులనుంచి పారద్రోలాలి. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతికపోరాటాల చైతన్యాలద్వారా ప్రజల్ని ఏకంచేసే క్రమములో ఈ దుష్ట మత వ్యవస్థను కులవ్యవస్థను నిర్మూలించవలసిన బాధ్యత ప్రతి ఒక్కరిమీద వుంది.



* * *

---

ఈ వ్యాసమునకు ఉపకరించిన గణాంక వివరములు మొత్తము బెంగుళూరులో 1981 జూన్ నెల 24, 25, 26 తేదీలలో క్రైస్తవచర్చిలో కులము-వర్గము అనే కాన్ఫరెన్సు నందు మిష్టరు పి. విజయమ్, ఎమ్. ఏ. బి. ఎల్ః ఎమ్. ఏ, బి. ఇడ్., డి. పెడ్, వైస్ ప్రెసిడెంట్ ఆఫ్ ఆల్ ఇండియా ఫెడరేషన్ ఆఫ్ అసోసియేషన్సు అండ్ క్రిష్టియన్స్ ఆఫ్ షెడ్యూల్డు కాస్ట్ ఆరిజన్ అండ్ జాయింటు సెక్రటరీ, ది ఫెలో ఆఫ్ యాక్షన్ కమిటీ ఆఫ్ ది నేషనల్ కన్వెన్షన్ ఆన్ ది ప్లైట్ ఆఫ్ ది క్రిష్టియన్స్ ఆఫ్ ఎస్. సి. ఆరిజన్ సమర్పించిన పేపరునందువి.